మన పుణ్యక్షేత్రములు 5

# పూరి



రచన :
ఉభయభాషాప్రవీణ :

శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి
తెలుగు పండిట్




వాహినీ పబ్లిషింగ్ హౌస్,
గవర్నరుపేట — విజయవాడ-2.

3

# పీఠిక

మన దేశములో అనేక "పుణ్యక్షేత్రములు, యాత్రాస్థలములు" గలవు. గాని అవి ఎచ్చటెచ్చట వున్నది, వానిపూర్వ చరిత్రను గురించి మనలో చాలమందికి తెలియదు. "తెలుగులో పుణ్యక్షేత్రములను గురించి యిదివరలో ఒకటి రెండు పుస్తకములు మాత్రము వెలువడినవి. కాని అందు ఆ యా క్షేత్రములకు వెళ్ళవలసిన మార్గములు తప్ప మరేమియు తెలుపబడలేదు. అదియునుగాక అవి పెద్దలకొరకే నిర్దేశింపబడినవి.

ప్రతిక్షేత్రమునకు కొంతపూర్వచరిత్రవుండును. మేము ఆయాచరిత్రలను ఈపుస్తకములందు వివరముగా ముఖ్యముగా పిల్లలకు అర్థమగుభాషలో ప్రచురించుచున్నాము. ఇట్లు మన భారతదేశమునందుగల అన్ని క్షేత్రములను గురించి వరుసగా ప్రచురింపదలచినాము. ఐదవదిగా ప్రసిద్ధక్షేత్రములైన "పూరి" "పండరి" "మహాకాళము" "ద్వారక"లను గురించి ప్రచురించుచున్నాము. గాన గ్రంథాలయాధిపతులు, విద్యాధికారులు మా కృషికి తగిన ప్రోత్సాహమిచ్చిన మిగిలిన పుస్తకములను గూడా మీ ముందుంచగలమని విజ్ఞప్తి చేయుచున్నాము.

ఇట్లు

ప్రకాశకులు.

# యిందులో

- పూరి
- పండరి
- మహాకాళము
- ద్వారక

# పూరి

తెల్లవారుజాము నాలుగు గంటలైనది. జనము ప్రవాహములుకట్టి గుంపులుగూడి పరుగులెత్తుకొని వచ్చి పడుచుండెను. సముద్రపు టొడ్డంతయు జనమయమైనది. ఇసుకవేసిన రాలుటలేదు. సముద్ర తరంగముల ఘోషను మించినది జనుల కోలాహలము. ఎవరంత కల్లోలము చేయుచున్న నందరి చూపులు సముద్రము వైపే. తరంగములు నిలువెత్తునకులేచి నురుగులు గ్రక్కుచు ముందుకు దుముకుచుండెను. జనులందరు నదిగో స్వామి యిదిగో దైవమని చేతులెత్తి దండము పెట్టుచుండిరిగాని యసలు జగన్నాథుడంతవరకు వచ్చినజాడ కనిపించలేదు. విద్యావతి తండ్రిని "నాయనగారు! దేవుడెక్కడనుండి వచ్చును?" అని ప్రశ్నించినది. తండ్రి కొంచెముసేపు మాటాడలేదు. ఆయనకు మాత్రమేమి తెలియును! విద్యావతి మరల ప్రశ్నించినది. ఆయన అన్ని తెలిసినట్లు నటించుచు మహాగంభీరముగా "అదేమిటమ్మా! అట్లడిగెదవు? సాక్షాత్తు జగన్నాథుడే దుంగగామారి సముద్రములో కొట్టుకొని వచ్చును" అని సమాధానము చెప్పెను.

"దుంగగా మారుట యెందులకు! ఆయనయే రాకూడదా"

"పాపాత్ములకు దేవుడు దర్శన మిచ్చునా?"

"మనము పాపాత్ములమైనచో ఆయన దర్శనమిచ్చి పుణ్యాత్ములుగా మార్చవచ్చుగదా? దుంగగామారి మనలను మోసముచేయుట యెందులకు?" అన్నది విద్యావతి.

విద్యావతి తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు చదువుకొనిన పిల్ల. ఆమె స్వయముగా నాలోచించగలదు. మంచి విజ్ఞానమున్నది. ఆమెకీ విషయములందు నమ్మకములేదు. తండ్రి యామె ప్రశ్నకు సమాధానము చెప్పలేకపోయెను.

విద్యావతి తండ్రిని "నాయనగారూ! ప్రతి సంవత్సరమీ దుంగ యిట్లే కొట్టుకొని వచ్చునా?" యని అడిగినది.

"అపరాధము దుంగయన కూడదు. జగన్నాథుడు. చంపలు వేసికొనుము" అని తండ్రి యనెను.

విద్యావతి తండ్రి మాటకెదురాడదు. ఆమె చంపలు వేసికొనినది. అంతలో "అదిగో స్వామి, జగన్నాథుఁడు" అని యందరు గొల్లుమనిరి. విద్యావతి యటు చూచెను. అర్చకులొక దుంగను రెండు చేతులతో నెత్తుకొని కన్నుల కద్దికొనుచు 'జయ జగన్నాథా' యని కేకలు వేయుచు సముద్ర మొద్దునకు వచ్చిరి. పురోహితులు స్వామిని సముద్రపుటొడ్డు నిలిపి మంత్రములతో స్నానము చేయించిరి. గంధము, కస్తురి, జవాది, పునుగు మొదలగు సుగంధములను రాచిరి. పుష్పములతో పూజించిరి. అన్ని యలంకారములుచేసి పల్లకిలో నెక్కించి గుడిలోనికి తీసికొనిపోయిరి.

విద్యావతియు తండ్రియు జనసమ్మర్థము తోసికొని గుడిలోని కరిగిరి. గర్భాలయమునకు ప్రదక్షిణముచేసి దేవుని

దర్శించిరి. విగ్రహములు కొయ్యలతో చేయబడినవి. వానికి కాళ్లు, చేతులు, ముక్కు, మొగములేవు. ధోవతి యొక విగ్రహమునకు చీరెయొక విగ్రహమునకు కలవు. మగవిగ్రహము జగన్నాథస్వామియనియు ఆడవిగ్రహము సుభద్రయనియు పూజారులు చెప్పిరి. విద్యావతి కనుమాన మారంభమైనది. ఏదైన యనుమానము తోచినప్పుడు వెంటనే యడుగుట విద్యావతి కలవాటు. తండ్రివంక చూచి "నాయనగారూ! సుభద్ర కృష్ణుని చెల్లెలుకాదా?" అని ప్రశ్నించినది.

అవును.

ఆమె భర్త?

అర్జునుడు.

మరి జగన్నాథుడేమిటి?

అదా నీ యనుమానము.

అవును.

అయితే విను. సుభద్ర కృష్ణుని చెల్లెలు. దేవకీ వసుదేవులకు కూతురు. శ్రీకృష్ణుడు విష్ణువుయొక్క అవతారము. చాల యందగాడు. పదారువేలమంది రాజకుమార్తెలాయనను వరించి పెండ్లి చేసికొనిరి. ద్వారకాపురములో మహా సౌధములలో వారినుంచెను. తాను వారితో సుఖముగా నుండెను. అర్జునుడు పాండవులలో మధ్యవాడు. సుభద్ర యర్జునునివరించినది. శ్రీకృష్ణుడు సుభద్రార్జునులకు పెండ్లి చేసెను. సుభద్రకు శ్రీకృష్ణుడనిన చాల ప్రేమ, గౌరవము, భక్తి కలదు. సుభద్ర శ్రీకృష్ణుని మహిమలు వినుచు

శ్రీకృష్ణుని మనస్సునందు తలంచుకొనుచు నుండెడిది. శ్రీకృష్ణుని చర్యలు ప్రతిదినము వినుచుండెను. ఆయన తప్పక నారాయణుడను నమ్మకము కుదిరెను. ఆయనను మనసార భక్తితో పూజించినది. ఇట్లు చాల కాలము గడచినది. పాండవులరణ్యవాసము చేసినప్పుడు సుభద్ర ద్వారకయందుండెను. ఆ కాలమున శ్రీకృష్ణుని సుభద్ర మరింత భక్తి ప్రేమలతో పూజించినది. శ్రీకృష్ణుడామె మనస్సునందు నిండియుండెను.

భారతయుద్ధ మైపోయినది. శ్రీకృష్ణుడు ముప్పదియారు సంవత్సరములు ద్వారకయందు సుఖముగానుండెను. ఒకనాడు నారదమహాముని ద్వారకానగరమునకు వచ్చెను. శ్రీకృష్ణుని సందర్శించెను.

"స్వామీ! భూమి భారమును తొలగించుటకు నీవు కృష్ణావతార మెత్తితివి. భారతయుద్ధమునందు లక్షలకొలంది మహావీరులు నశించిరి. దుర్మార్గులగు కౌరవులను శిక్షించితివి. భీష్మాది మహాభక్తులకు మోక్ష మొసంగితివి. పాండవులకు సర్వరాజ్య మిచ్చితివి. నీవు భూమియందవతార మెత్తిన కారణ మయిపోయినది. నీవు లేకుండుటచేత వైకుంఠమింత కాలము చిన్నపోయినది. దేవతలు బెంగకొని యున్నారు. వైకుంఠమునకింక దయచేయుము" అని ప్రార్థించెను.

శ్రీకృష్ణుడు నారదుని మాటలలోని సత్యమును తెలిసికొనెను. "అవును. నేను భూలోకమునకు వచ్చినపని తీరిపోయినది. ఇంక వైకుంఠమున కరుగవలయును. అందులకు

తగిన ప్రయత్నము చేయవలయును'' అని తలంచెను. నారదుడు తనదారి తాసరిగెను.

శ్రీకృష్ణుడు చేయవలసిన ప్రయత్నములన్నియు చేసెను. దేవకీ వసుదేవులను, రుక్మిణీ సత్యభామాదులను చుట్టపక్కములనందరిని చేరపిలిచెను. ఎవరికి చెప్పవలసిన మాటలు వారికి చెప్పెను. ఎవరికే కోరికలున్న నవియన్నియు తీర్చెను. శ్రీకృష్ణుడు సుభద్రగదిలోనికి పోయెను. ఆమె శ్రీకృష్ణుని మనసార తలంచుకొని ధ్యానించుచుండెను.

కృష్ణుడు 'సుభద్రా ! చెల్లీ!' అని పిలిచెను.

సుభద్ర యులికిపడి కన్నులు తెరిచెను. తటాలున లేచెను. శ్రీకృష్ణుని పాదములకు నమస్కరించెను. శ్రీకృష్ణుడు చెల్లెలిని మిగుల నాదరముతో లేవనెత్తి, ''చెల్లీ ! అందరు నన్ని కోరికలు కోరుకొనిరి. నీ మనస్సులోని కోరిక తెలుపుము. తప్పక దానిని నెరవేర్తును'' అనెను.

సుభద్ర మొదట చెప్పుటకు సిగ్గుపడినది. శ్రీకృష్ణుడామెను బుజ్జగించి యడిగెను.

''అన్నా ! నీవు శ్రీమన్నారాయణుడవు. నీ సంగతి నాకు తెలియును. స్త్రీల మనస్సులతి చంచలములని నీకు తెలియును. అందమగు పురుషులను గన్నప్పుడు వారి హృదయములు దిటవు తప్పును. నాకు నీవంటివాడు భర్త కావలయును'' అని కోరెను.

కృష్ణుడు మరల జన్మయందు నీ కోరిక నెరవేరకలదు అని వరమిచ్చెను. శ్రీకృష్ణుడు జగన్నాథుని యవతార

మెత్తెను. సుభద్ర వానికి భార్య యయ్యెను. వారే యీ సుభద్రా జగన్నాథులు.

౨

నాన్నగారూ! ఈ స్వామికి చేతులు కాళ్లులేవేమి?

లేవు.

ఎందుకని?

అదియొక కథ.

ఏమిటా కథ.

వినుటకు వింతగానున్నను నేను నీకు చెప్పుటకంత సమంజసముగా నుండదు.

దేవతల కథలు చెప్పుటకేమి? మనము కల్పించినవి కాదుకదా!

కాదు.

ఇంక తప్పేమి!

అట్లయిన వినుము. ద్రౌపది పాండవుల భార్య నీకు తెలియునుగదా?

తెలియకేమి!

ద్రౌపది సంవత్సరమున కొక్కనియొద్ద చొప్పున నైదుగురియొద్ద నైదు సంవత్సరములవంతున కాపురము చేయుచుండును. ఒకరితోనున్నప్పు డింకొకరామెను చూడ

రాదు. ఇది పాండవులు చేసికొనిన యొడంబడిక. ద్రౌపది యజ్ఞవేదికయందుండి పుట్టినది. మహాపతివ్రత. శ్రీకృష్ణుని భక్తురాలు. ఆమె మహాశక్తిస్వరూపురాలని యందురు. అసలు స్త్రీలు శక్తిస్వరూపులని పురాణములు చెప్పుచున్నవి. అందు ద్రౌపది సంగతి చెప్పవలసిన పనిలేదు. భారతయుద్ధము నందు మహాయోధులు పెక్కుమంది మరణించుచు వచ్చిరి. పదునెనిమిది దినము లఖండముగా యుద్ధము జరిగెను. భీష్మునిచేతిలో చనిపోయినయోధులకు లెక్కలేదు. ద్రోణుడు మహావీరుడు. ఆయనపేరు చెప్పినంతమాత్రముచేతనే పాండవ సేనలు గడగడలాడినవి. ప్రాణములు విడిచినవి. ఇంక నర్జునుడు వీరాధివీరుడు. కౌరవసేనను ఊచకోతకోసినాడు. భీముడు యోధులను, ఏనుగులను, రథములను పిప్పిపిప్పి గావించి నాడు. మిగిలినవారు మిగిలిన వారే. వారి సంగతి చెప్పనక్కర లేదు. ఈ యుద్ధకాలమునందు ప్రతి దినము ద్రౌపది యర్ధ రాత్రివేళ యుద్ధభూమికి పోవుచుండును. కనుల పండువుగా చచ్చిన వారినందరిని నలువైపులందుచూచి యానందించును. తన రూపమునువీడి భయంకరమగు మహాశక్తిరూపమును దాల్చును. యుద్ధభూమియు పొరలిపారురక్తమును త్రాగును. శవమాంసమును కడుపారతినును. త్రేన్చుచు నింటికి వచ్చును.

ద్రౌపది భీమునితో కాపురము చేయుచున్న దినము లవి. భీముడు ద్రౌపదినోటినుండివచ్చు రక్తమాంసముల వాసన పసికట్టెను. ఆతడు లోలోపల నాశ్చర్యమును జెందెను.

కాని ద్రౌపదిని యడుగలేదు. కారణము తెలిసికొనవలయునని భీముడు కుతూహలపడెను. ఆరోజు రాత్రియైనది. చీకటి నలువైపులందావరించినది. భీముడు నిద్రపోవుచున్నటుల నటించెను. అర్ధరాత్రియైనది. ద్రౌపది పూర్వమువలె లేచినది. చప్పుడుచేయకుండ మందిరమునుండి వెలువడినది. భీముడది యంతయు చూచెను. అతడుకూడ లేచెను. ద్రౌపదికి కనబడకుండ వెంబడినే బయలుదేరెను. ద్రౌపది యెప్పటివలె యుద్ధభూమియందు ప్రవేశించినది. నలుమూలలు చూచినది. అంతలో నామె రూపము మారిపోయినది. తాడియంతగా పెరిగినది. పదిచేతులు అరటిపూవు దొప్పలవలె నెఱ్ఱని పెద్ద కనులు, జడలుకట్టిన తల వెంట్రుకలు, పెద్దబానవంటి కడుపు, నోటియందు పొడుగైన కోరలు, నల్లనిరూపము కలది యయ్యెను. ఆ రూపముచూచి భీముడు భయపడెను. అది మహాకాళిరూపము. ఒక పెద్దపెట్టున వికటముగా నవ్వుచు కేకలుపెట్టిన దాశక్తి. ఆ కేకలురుములవలె నుండెను. నలుమూలలనుండి భయంకరముగా నరచుచు భూతములు, పిశాచములు ప్రేతములు చుట్టు చేరినవి. వానితోకలసి యామె రక్తమాంసములతో విందులు సాగించినది. కపాలములను పగులగొట్టి క్రొవ్వు మెదడులు కడుపునిండ నారగించినది.

అంతలో తెల్లవారుజామయినది. ద్రౌపటి పూర్వపు రూపమును ధరించినది. ఎక్కడి వారి నక్కడికిపంపి తాను ఇంటికి బయలుదేరినది. భీముడిదియంతయు చూచెను. లోలోపల భయపడెను. మరల తన మందిరమునకు వచ్చెను.

ఏమియు నెరుగనటుల మంచముమీద పరుండెను. తెల్లవారి నది. భీముడు శ్రీకృష్ణుని సందర్శింప నరిగెను. ఆయనతో నాఁటేయి జరిగినసంగతి తాను చూచినది చూచినటుల చెప్పెను.

శ్రీకృష్ణుడు, "బావా! నీవు చూచినదంతయు నిజము. దీనిలోనొక రహస్యమున్నది. అది నీకు తెలియదు. ద్రౌపదియనిన సామాన్యురాలుకాదు. ఆమె యింద్రాణియను మహాశక్తి. పాండవులు మీ రైదుగురు నింద్రునియంశతో పుట్టినవారు. ఇంద్రాణి భూమి ప్రజలను సంహరించి భార మును తగ్గించుటకయి ద్రుపదునకు కూతురయి పుట్టినది. మీకు భార్యయయినది. భారతయుద్ధమునందు ప్రజలందరు నామె మూలమున మరణింతురు. ఆ మహాదేవి మిమ్ముకూడ బ్రతుకనీయదు. మిమ్ము మీకుమారులను ఏదో విధముగా చంపి భక్షించును. ఆమెయెడల జాగరూకత కలిగియుండ వలయును" అనెను.

భీముడా మాటలకు భయపడెను. "కృష్ణా! మమ్మీ కష్టమునుండి కాపాడుము. మేము నీ భక్తులముకదా" యని వేడుకొనెను.

అంత కృష్ణుడు, "భీమసేనా! భయపడకుము. నీకొక యుపాయము చెప్పెదను వినుము. ద్రౌపది నీ దగ్గరకు వచ్చును. ఆమెను నీవేవిధము చేతనైన సంతోషపెట్టుము. ఆమె నీకేమి కావలయునో యడుగుమనును. నీవు 'మా



మైదుగురు ప్రాణములు రక్షింపు'మని యడుగుము. ఆమె "సరే" యనును. అప్పుడు మీరు కాపాడబడుదురు" అనెను.

భీముడు 'సరే'నని వెడలిపోయెను.

రాత్రియైనది. భీముడు పడకగదికి చేరెను. ద్రౌపది భీముని యొద్దకు వచ్చెను. భీముడు ప్రతిదినముకంటె మరింత యుత్సాహముతోడను, సంతోషముతోడను మాట్లాడు చుండెను. ద్రౌపది మరింత వేడుకగానుండెను. ఆ సమయము తెలిసి శ్రీకృష్ణుడు భీమునియందావేశించెను. ఇంక మాటకు చేతలకు నేమితక్కువ తెల్లవారుజామయినది. ద్రౌపది మహానందమును బొందెను. భీమునివంక చూచి, "నీవలన నేను సంతోషించితిని. నీకు కావలసిన వరమును కోరుకొనుము" అని యొడలు తెలియని యానందములో నన్నియుమరచి పోయి పలికెను.

అంత భీముడు, "ద్రౌపదీ! మా యైదుగురు సోదరులను బ్రతికింపుము" అని వేడుకొనెను. ద్రౌపది నిర్ఘాంతపోయినది. మనస్సులో నాలోచించినది. తన దివ్యదృష్టితో చూచినది. ఇది కృష్ణునిమాయయని తెలిసికొనినది.

"కృష్ణా! నీకు నేను సహోదరిననియైన తలంపక యీ నీచకార్యము గావించితివి. నీ హస్తములు, కాళ్లుమాత్రమే చితియుండు కాలునుగాక" యని శపించెను.

అంతలో శ్రీకృష్ణు డామెయెదుట కనిపించెను. "చెల్లీ! నీ శాపము నాకు వరమైనది. సుభద్రకొరకు నేను మరల

యవతార మెత్తవలసియున్నది. నీ శాపమువలన మొండిజగన్నాథుడనయి యవతరింతును" అని పలికి యంతర్ధానము నొందెను.

శ్రీకృష్ణుడవతారము చాలించెను. ఆయన శరీరము చితియందు దహించిరి. చేతులు కాళ్లు మాత్రము కాలినవి. మొండెము అంతర్ధానమైనది.

## 3

ఆ కాలమునందు ఓఢ్రదేశమును విష్ణుభక్తుడగు నొక రాజు పరిపాలించుచుండెను. అతడు ధర్మపరుడు, నీతిగలవాడు. వానికారేయి యొక స్వప్నము వచ్చెను. అందు శ్రీకృష్ణుడు కనిపించి, "రాజా! రేపు నీయొద్ద కొకశిల్పి వచ్చును. అతడు దేవతా విగ్రహములను చెక్కును. వానిచేత నా రూపము చెక్కించుము. దానితోపాటు సుభద్రరూపమును చెక్కింపుము. పూరీనగరమునందా రెండు విగ్రహములను ప్రతిష్ఠింపుము" అనిచెప్పి మాయమయ్యెను.

ఆరాజు నిద్రమేలుకొని మిగుల ఆశ్చర్యమునొందెను. తెల్లవారినది. కాలకృత్యములను తీర్చుకొని మంత్రులను రావించెను. వారితో తన కలసంగతి వినిపించెను. మంత్రులు మహానందమును బొందిరి. వారిట్లు మాట్లాడుకొనుచుండగనె యొకశిల్పి యచ్చటకు వచ్చెను. మహారాజునకు నమస్కరించెను.

రాజు వానివైపు ముఖంబయి, "ఎవరు నీవు" అని ప్రశ్నించెను.

మహారాజా ! నేనొక శిల్పిని.

నీవేమి చేయుదువు ?

దేవతావిగ్రహములను చెక్కుదును.

నీ యూరు?

ప్రభూ ! కడుపుపట్టుకొని జీవించువానికొక యూరని కలదా, నేడిచ్చట, రేపింకొకచోట.

మహారాజు శిల్పిని తలనుండి పాదములవరకు నెగాదిగ చూచెను. రాత్రి శ్రీకృష్ణుడు స్వప్నమునందు సూచించిన శిల్పి యితడేయగునాయని యాలోచించెను. శిల్పీ ! మాకు సుభద్రా జగన్నాథుల విగ్రహములుచెక్కి యీయవలయును.

చిత్తము.

ఎంతకాలము పట్టును.

ఇంతకాలమని నిర్ణయ మెక్కడిది ప్రభూ ! సంవత్సరమైన పట్టకపోదు.

సరే.

కాని నాదొక మనవి.

ఏమిటది.

నేను విగ్రహములను చెక్కుచోటికెవరు రారాదు.

అట్లే కానిమ్ము.

రాజు శిల్పికొక విశాలమగు భవనము నిచ్చెను. అందతడు తలుపులుమూసికొని విగ్రహములు చెక్కుటకారం

భించెను. దినములు గడచినవి. వారములు తీరినవి. నెలలు దాటినవి. సంవత్సరములు గతించినవి. విగ్రహములు తయారు కాలేదు. శిల్పి కనిపించలేదు. రాజునకు విసుగు పుట్టినది. రాజభటులను పిలిచి తలుపులు పగలకొట్టించెను. భవనము లోని కరిగి చూచెను. ఈ విగ్రహములు కనిపించినవి. కాలు చేతులు లేవు. మొండెములవరకు చెక్కబడినవి రాజు శిల్పి కొరకు వెదకించెను. శిల్పి యెచ్చట కానరాలేదు. తన తెలివి తక్కువతనమునకు రాజు చింతించెను. ఆరేయి స్వప్నము నందు శ్రీకృష్ణుడు కనిపించెను. "రాజా! విచారింపకుము. ఆ శిల్పిని నేనే. ఆ విగ్రహములట్లే యుండవలయును. నీవు వానిని గుడియందు ప్రతిష్ఠింపుము" అని పలికి యంతర్ధానము నొందెను.

మరునాడు రాజు కార్తాంతికులను రావించి, మంచి ముహూర్తము నిర్ణయించి వానిని గుడియందు ప్రతిష్ఠించెను. అందుకని యీ విగ్రహము లిట్లున్నవి. ఈ సంగతి జరిగిన తరువాత పూజారికి స్వప్నమునందు జగన్నాథుడు కనిపించి, "ఓయీ! మీస్వామికి వైశాఖశుద్ధదశమి మొదలుత్సవములు జరుగవలయును. ఆయుత్సవములకు సముద్రమునందొక కొయ్య ప్రాను కొట్టుకొని వచ్చును. దాని కుత్సవము జరుపుచుండ వలయును. అది నా ప్రతిమ" అని పలికెను. నాటినుండి నేటి వరకట్లే జరుగుచున్నది.

విద్యావతి యింకనేదో ప్రశ్నింపబోయినది.

"అమ్మా! విద్యా! అదిగో ప్రసాదము తీసికొనుము. దీనినిగురించి యనేకమంది యనేక విధముల చెప్పుదురు. ఎవరి యభిప్రాయము వారిది. నిజము తెలిసినవారు లేరు" అనెను.

"ఏమిటది?" అని విద్య ప్రశ్నించినది.

"ఈ ప్రసాదము కుండలతో వండుదురు. వండునప్పు డొకకుండమీద నింకొక కుండచొప్పున దొంతరలుగా పేర్చు దురు. క్రింద మంట పెట్టుదురు. జగన్నాథుని మహిమవలన పై కుండలోనుండి ప్రసాదము క్రమక్రమముగా నడుగుకుండ లలోని కుడుకుచు పోవునట"

"ఎవరైన చూచితిరా"

"చూచినవారు లేరు. పూజారులు చెప్పుదురు. కుమ్మ రులు వండుదురట"

"అదేమిటి"

"అదే సర్వము జగన్నాథమందురు"

విద్యావతి ప్రసాదము తిని చేయి కడుగుకొనుటకు నీటికయి వెదకుచుండెను.

తండ్రి "విద్యా! మహాప్రసాదము తిని చేయి బట్ట లకు తుడుచుకొనవలయును. నీటితో కడుగుకొనరాదు. సర్వము జగన్నాథము. అంటు సొంటులేదు" అనెను.

ఆమాట విద్యావతికి నచ్చలేదు. గుడి తలుపులకు చేతులు తుడిచినది.

అది తండ్రిచూచి, "అమ్మా! అది తప్పు" అన్నాడు.

"నాయనగారు! మీరిప్పుడే చెప్పితిరికదా సర్వం జగన్నాథమని, ఇందులో తప్పేమున్నది. ఒంటికి పూసు కొన్నను తలుపులకు పూసిన నొకటే" అన్నది.

తండ్రికి నవ్వు వచ్చినది. "నీవు అంతకంతకు చిన్న దానవై పోవుచున్నావు" అన్నాడు.

"మీకంటె చిన్నదాననేకదా" అన్నది విద్య.

"సరే రైలు వేళయినది పోదాము" అన్నాడు తండ్రి.

తండ్రి కుమార్తెలు బండికట్టుకొని స్టేషనుకు వచ్చిరి. పూరినుండి బెజవాడకు పోవురైలు తయారుగా నుండెను. వారు రైలులో నెక్కి మరునాడు ఒంటిగంటకు బెజవాడ చేరిరి.

# పండరి

పుణ్యక్షేత్రములందు పండరి యొకటి ముఖ్యమైనది. అది మహారాష్ట్ర దేశమునందున్నది. అందలి దేవుడు పాండు రంగడు. మహారాష్ట్రులకు పాండురంగడనిన మహాప్రీతి. ప్రతివానినోటినుండి 'పండరినాథా! రంగా!' అను మాటలు దినమునకు ముప్పూటల మూడుసారులైన వెలువడకమానవు. దుఃఖపువార్తవినినను సుఖసంగతు లాలించినను 'పాండురంగా' అనుటవారియలవాటు. వారిబిడ్డలకు పండరీబాయియని విఠలరావు అని పేరు పెట్టుకొనుచుందురు. మహారాష్ట్రులసం

చోటుచూచినను పండరిభజనలుసాగుచుండును. ఏభక్తునికద లించినను 'పాండురంగా' అనునామమే వెలువడుచుండును. పండరిభక్తులు కూటములుగాచేరి దేశదేశములందు పాండు రంగని భక్తిప్రచారముచేయుచుందురు. బెజవాడయందు పదేండ్లక్రిందట అట్టిభజనసమాజ మొకటి వచ్చి నెలలుతరబడి భజనలుసాగించినది. పాండురంగని గురించిన కీర్తనలు, ఉప న్యాసములు, మహిమలు శరపరంపరలుగా గుప్పించి ప్రజలను సంతోషపరచిరి. దానిశాఖ యిప్పటికి విజయవాడయందు కలదు. విజయవాడయందేకాదు తెనుగుదేశములోని నగ రములందన్నిచోటులగలదు.

పాండురంగని విగ్రహామతిమనోహరముగా నాలుగడుగుల యెత్తుననుండును. నల్లని శిలతో మలచబడినది. మనదేశము నందువలె గర్భగుడిలోనికి పోరాదను నియమచటలేదు. ప్రతి వారును స్వయముగా పోవచ్చును. స్వామినితాకవచ్చును. వర్ణభేదములేదు. పూజచేయవచ్చును. పూజారులు పేరుమా త్రమునకుందురు. మొక్కులు చెల్లింపవచ్చును. రావచ్చును. వివిధరాష్ట్రములనుండివచ్చి భక్తులు ప్రతిదినము స్వామిదర్శ నము చేసికొనిపోవుచుందురు. పండరియందు యాత్రికుల సౌక ర్యము కొరకుపెక్కు ధర్మసత్రములు నిర్మింపఁ బడినవి. ఏవీధియందుచూచినను ధర్మసత్రమే. ఎక్కడచూచినను యాత్రికుల సమర్థమేకనిపించును.

విద్యావతితండ్రితోకలిసి విజయవాడయందు రాత్రి తొమ్మిదిగంటలకు జనతారైలెక్కినది. ఆరాత్రింతయు

ప్రయాణముచేసి తెల్లవారునప్పటికి హైదరాబాదునకు చేరుకొనిరి. అచట కాలకృత్యములు తీర్చుకొని ఫలహారముచేసి వచ్చునప్పటికి మరల రైలు బయలుదేరినది. బొంబాయి మార్గమునుపట్టి యా పగలంతయు ప్రయాణము చేసెను. దారియందు చూడ వినోదమగు పట్టణముగాని పల్లెగాని లేదు. రాత్రి ఒంటిగంట యగునప్పటికి పూనాపట్టణము చేరిరి. పూనా మహారాష్ట్రదేశమునకు ముఖ్యపట్టణము. విశాలమగు నగరము. అచట శివాజీఛత్రపతి పూర్వము రాజ్యమును పరిపాలించెను. అచట ఛత్రపతికోటయు కలదు. విద్యావతి తండ్రితో నచట రైలు దిగినది. తండ్రి కుమార్తెలు ఆరాత్రి స్టేషనునందు విశ్రాంతితీసికొని తెల్లవారి స్నానాదులు కావించి యూరు చూచుటకు బయలు దేరిరి. విశాలమగు బాటలు, పూదోటలు, మేడలు చూచుచు మధ్యాహ్నము వరకు గడపిరి. మధ్యాహ్నము భోజనముచేసి మోటారుమీద పండరిపురమునకు ప్రయాణమైరి. రాత్రి పదిగంటలకు పండరీపురము చేరిరి.

పూర్వమొకప్పుడా సమీప ప్రదేశమంతయు దట్టమగు మహారణ్యములతో నిండి యుండెను. పులులు, చిరుతలు, ఎలుగులు, వరాహములు మొదలగు క్రూరమృగము లా యడవియందు కాపురముండెడివి. చెట్లు ఆకాశమున కంటునట్లు పెరిగి కొమ్మలు ప్రక్కలకుసాగి యొకదానితో కలిసికొని సూర్యకిరణములైన లోనికి చొరనీయక చీకటులు కలిగించుచుండును. ఆ యడవియందు పొదలు, తుప్పలు దట్ట

ముగా పెరిగి కాలు పెట్టుటకు వీలు లేకుండును. ఆ మహా రణ్యమునందు మునిపల్లె యొకటి కలదు. అందు యజ్ఞుడను నొకముని కలడు. అతడు చిన్నతనము నుండియు విష్ణువును గురించి ఘోరమగు తపస్సు చేయుచుండెను. ఎంతకాలము నకు విష్ణువు ప్రత్యక్షము కాలేదు. కాలము గడచిన కొలం దియు యజ్ఞునకు పట్టుదల మించిపోయెను. తిండి, నీరు, నిద్ర విడిచిపెట్టి నిశ్చలమగు సమాధియందుండి తపముచేయ నారం భించెను. సంవత్సరములు గడచినవి. యజ్ఞుడు తన పట్టుదల మానలేదు. వాని ముఖమునుండి బ్రహ్మతేజస్సు చంద్ర కాంతులవలె వెలువడుచుండెను.

ఒకనాడు విజగీషయను నొక యక్షకన్యక భూలోకము నందక్కడక్కడ తిరుగాడుచు యజ్ఞుడు తపముచేయుచున్న చోటునకు వచ్చె. ముఖమునుండి వెన్నెలవలె తెల్లనికాంతులు నలుదెసలకు వెదజల్లుచున్న యజ్ఞుని ముఖము చూచెను. వాని యందచందములకు నాశ్చర్యము నొందెను. ప్రశాంత మగు వాని ముఖలక్షణములకు విస్తుపోయెను. యజ్ఞుడు తపస్సు చాలించి లేచువరకు నచటనే మసలెను. విజగీష యందకత్తె. యౌవనమందున్న యువతి. యజ్ఞుడు విజగీషను చూచెను. ఆమెను ప్రేమించెను. విజగీషా యజ్ఞులు కొంతకాలము సంసారము చేసిరి. వారిరువురకొక కుమారుడు పుట్టెను. పుట్టగానే విజగీష యా కుమారుని యజ్ఞునకిచ్చి యక్షలోక మున కామె వెడలిపోయెను.

యజ్ఞుడు పిల్లవానిని ఆశ్రమమునందుపెట్టి తాను తపస్సు చేసికొనుచుండెను. ప్రతిదినము నొక పెద్దపులి

మూడుపూటలాశ్రమమునకువచ్చి యా పిల్లవానికి పాలిచ్చి పోవుచుండెను. ఆపాలను త్రాగి పిల్లవాడు పెరిగి పెద్దవాడగుచుండెను. కొన్ని సంవత్సరములు గడచినవి. పుండరీకునకు అయిదేండ్లు వచ్చినవి. తపస్సునకుపోయిన యజ్ఞుడాశ్రమమునకు వచ్చెను. పిల్లవాడు వెల్లకిలగా పరుండెను. పులి వానిమీద కాళ్లిటు నటునుంచి పాలిచ్చుచుండెను. యజ్ఞుడది చూచి బాలుని పులి చంపుచున్నదని తలంచి తన చేతిలోనున్న కఱ్ఱపెట్టి పులిని కొట్టెను. ఆపులి విజగీషగా మారి పోయెను. యజ్ఞుడాశ్చర్యపడి యిది యేమని యడిగెను.

ఆమె యిట్లు చెప్పెను. నాథా! నేను నిమ్ము విడిచి పోవలేక పోవలేక పోవుచుంటిని. నా కమితమగు దుఃఖము కలిగినది. దారిలో నొడలు తెలియక పోవునపుడొక ముని తపము చేసికొనుచుండగా వానికి నా పాదము తగిలినది. ఆ ముని నామీద కోపించి భయంకరముగా గర్జించుచు కను లెఱ్ఱచేసి ముఖము కండలు రాల, "ఓసీ! ఒడలెఱుగక నన్ను కాలితో తన్నితివి. నీవు పెద్దపులి వగుము" అని శపించెను. నేను తెలియక చేసిన తప్పు క్షమింపుమని వేడుకొంటిని. దాని కతడు శాంతించి, "ఈ శాపము నీకు మంచిదేయైనది. నీ ప్రియుడు బాలునివిడిచి తపమున కరిగెను. వానిని నీ పాలతో పెంచుచుండుము. నీభర్త నిన్ను గుర్తింపక యోగదండముతో మోదును. అప్పుడు నీ శాపము తీరును" అని చెప్పెను! నా శాపము తీరినది. 'ఈబాలుని జాగరూకతతో పెంచుకొనుము' అనిచెప్పి విజగీష గంధర్వలోకమున కరిగెను.

పుండరీకము పాలతో పెరుగుటచేత బాలునకు పుండరీకుడని పేరుపెట్టి వానిని యజ్ఞుడు పెంచుచుండెను. పుండరీకుడు పెరిగి పదేండ్ల వాడయ్యెను. తండ్రి వానినతి గారాబముతో పెంచెను. పుండరీకునకు యజ్ఞుడు ఉపనయనము గావించెను. వేదములను వల్లనవేయించెను. శాస్త్రములను బోధించెను. ఉపనిషత్తులను చెప్పెను. పుండరీకుడన్నిటియందు మహాపండితుడయి యాశ్రమవాసుల గౌరవము సంపాదించెను.

౨

చిన్నతనమునుండియు పుండరీకుని స్వభావమతి విచిత్రమైనది. అతడితరులతో మాట్లాడుట కిష్టపడడు. తోడిబాలకులతో నాడుకొనడు. ఎప్పుడు నేదో యాలోచించుచుండును. వాని విచారము దేవునిగురించి. శాస్త్రములేమైన తనకు తోడ్పడునేమోయని యక్షరము విడువకుండ యన్నియు చదివెను. వాని యూహ నిరూపయోగమైనది. విద్య విజ్ఞానము కలిగించినది. తన సందేహములు తీర్చలేదు. తండ్రి తనకు విద్యా గురువు. మహాతపస్వి, ఆయనను ప్రశ్నించెను. తగిన సమాధానమయిన చెప్పలేదు, "దేవుడనగా నెవరు? ఆయన యెట్లుండును? ఎక్కడుండును? అన్నిటియందు కలడందురు. వానిని చూచిన వారెవరు?" ఇటువంటి యనుమానములు కలిగినవి. వానికి తగిన సమాధాన మెవరు చెప్పగలరు.

ఒకనాడు పుండరీకు డడవియందొంటరిగాకూర్చుండి యాలోచించుచుండెను. వాని యొద్దకొక ముని వచ్చెను. వాని ముఖము పరిశీలించెను.

"నాయనా! యేమి టాలోచించుచున్నావు?" అని యడిగెను.

పుండరీకునకు ప్రాణము లేచివచ్చినట్లైనది. "తాతా! నీవు దేవుని చూచితివా?" అని ప్రశ్నించెను.

ఆ! చూచితిని.

ఆయన యెట్లుండును?

అదేమిటి నాయనా! అట్లడిగెదవు? నేను చెప్పిన నీవు చూచి నట్లగునా? నీవే చూడుము.

ఆయన యెట్లు కనపడును.

అదా నీ సందేహము. ఇక్కడనే కూర్చుండి కనులు మూసికొని ధ్యానింపుము. నీకే కనిపించును.

పుండరీకు డచ్చటనే కూర్చుండెను. కనులుమూసుకొని ధ్యానించుట మొదలు పెట్టెను. అన్నములేదు, పానము లేదు, నిద్రలేదు. దినములు, వారములు, నెలలు, సంవత్సరములు గడచినవి. పుండరీకుడు లేవలేదు. కనులు తెరువ లేదు. విసుగుపడలేదు. వానికి ధ్యానముతప్ప రెండవ పని లేదు. పది సంవత్సరములైనది. ఒంటియందలి రక్తమాంసము లుడిగిపోయినవి. ఉట్టి యెముకలు, చర్మము మిగిలినవి. ఒక నాడు పుండరీకుడు దేవుని ఏకదీక్షగా ధ్యానము చేయుచుండెను.

ఆ సమయమున "పుండరీకా నీ తపము చాలును. కన్నులు తెరువుము" అని మాటలు వినవచ్చెను.

పుండరీకుడు కనులు తెరిచెను. ఎదుట నొక దివ్య రూపము చూచెను. ఆ రూపమునుండి కోటిచంద్రులకాంతి వెలువడుచుండెను. నడుమ నడుమ మెరుపులు పొడము చుండెను. పుండరీకుని కనులు చల్లనైనవి. మిరుమిట్లు పొడమినవి. ఒకసారి మరల కనులు మూసికొని తెరిచెను. తలయెత్తి చూచెను. తలమీద నవరత్నములు పొదిగిన కిరీటము, చిరునగవులు చిందులాడుచున్న గుండ్రని ముఖము. చెవులనంటుకొనుచున్న కనులు, విశాలమగు నుదురు, కొసతేరిన పొడుగాటి ముక్కు, ఉబికిన కంఠము, ఎత్తైన వక్షము, మెడనుండి వ్రేలాడుచున్న రత్నహారములు, కౌస్తుభాలంకార వైజయంతి మాల, చెవులకు రత్నకుండలములు, నడుమునకు బంగారు వన్నె పట్టువలువ దానిమీద మెలివేసికట్టిన యాకుపచ్చని బంగారు జరిపట్టుత్తరీయము, మోకాళ్ళవరకు వ్రేలాడుచున్న చేతులు, వానిలో శంఖము, చక్రము, గద, కమలములు, భుజకీర్తులు, చేతులకు రత్నపు గండపెండేరములు, పాదములకు పచ్చల బంగారుటందెలుగల యొక యందమగు రూపము చూచెను. పుండరీకుడా మూర్తిని తలనుండి పాదములవరకు తేరిపార చూచెను. మరల మరల వీక్షించెను. లోలోన నుప్పొంగెను. పరమానందము నొందెను. ఆయన పాదముల మీద వ్రాలెను.

"స్వామీ! కనిపించితివా ప్రభూ! నన్ను కృతార్థుని చేసితివి. మహామునులునైతము చూడని నిన్ను చూచితిని.

స్వామీ ఎంతదూరమునుండి నాకొరకు వచ్చితివో. చిగురుల వంటి నీ పాదములు కందిపోయినవి ప్రభూ ! ఏవీ ? వానిని నా చేతులతో ఒత్తుదును. ఇటు తెమ్ము" ఇదిగో దర్భాసనము దీనిమీద కూర్చుండుము. ఆకలియైనది కాబోలు, తినుటకు పండ్లు తెచ్చెదను" అని స్వామిని కూర్చుండబెట్టెను.

వానికొరకు నడవి పండ్లనుకోసికొనివచ్చి ముందుంచెను "ప్రభూ ! ఇది మహారణ్యము. ఇచట నింతకంటె నేమి దొరకగలవు. పప్పు భోజనములా పాయసాన్నములా ? తినుప్రభూ ! రాకరాక వచ్చితివి" అని యొకొక్క ఫలము చేతి కందించుచు పాదముల నొత్తుచుండెను. పరమేశ్వరు డాతని భక్తికి, పరవశత్వమునకు పరమానందము పొందుచుండెను. పుండరీకు డాయననుచూచి ప్రపంచమునే మరచెను.

పుండరీకా !

స్వామీ !

ఈ ఫలములెంత రుచిగా నున్నవి !

పరిహాసమా ప్రభూ !

కాదు. అమృతమునకైన నీ తియ్యదనములేదు. ఇదిగో ఈ చిన్నదగ్గు ముక్కను నీవు తిని చూడుము. అని యొక ముక్కను పుండరీకున కందించెను. 'మహాప్రసాద'మని పుండరీకుడద్ది తినెను. వెంటనే యతడు పూర్వముకంటె తేజము, బలము, నందము కలవాడయ్యెను.

పుండరీకా ! ఏల తపస్సుచేసి యీ శరీరమంత చిక్కించుకొంటివి అని శ్రీహరి ప్రశ్నించెను.

నేను చిక్కినగాని నీవు నాకు చిక్కవైతివి. ఏమి చేయను.

నావలన నీకేమిలాభము ?

"స్వామీ ! నీ సాన్నిధ్యమే నాకానందము. నీ వెప్పుడు నిక్కడే యుండుము. నీకు నేను సేవలు చేయు చుందును. లేదా నన్ను నీతో కొనిపొమ్ము" అనెను.

నీవింక నిక్కడ కొంతకాలముండవలసిన పనియున్నది. జనులకు భక్తి మార్గమును బోధింపుము. నీవు కోరినప్పుడు నా వెంట కొనిపోవుదును.

"అంతవరకు"

"అంతవరకు నా యాకృతి నిచట నిలుపుదును. దానికి నీవు సేవలొనరించి తరింపుము. లోకులను తరింప చేయుము. ఈ క్షేత్రము నీపేర పుండరీకక్షేత్రమని పిలువ బడును. నేను పాండురంగడని పిలువబడుదును"

శ్రీమహావిష్ణువు శిలావిగ్రహముగా మారిపోయెను. ఈవార్త చుట్టుపట్టు పల్లెలకు, పట్టణములకు, రాజులకు తెలిసెను. కోట్లకొలంది జనులువచ్చి చూచి పోవుచుండిరి. రాజులందరు లక్షలకొలంది ధనమును ఖర్చుపెట్టి యీ విగ్రహమున కాలయము కట్టించిరి. సత్రవులు నిర్మించిరి. ప్రతిదిన మానాటినుండి నేటివరకు పూజలు పురస్కారము సాగుచుం

డెను. అచట క్రమక్రమముగా పెద్ద నగరమైనది. భక్త లందరు వచ్చి దేవుని సేవించి పోవుచుండిరి. ఆ పుండరీక క్షేత్రమే నేడు పండరి యైనది.

## 3

పిలిచినపలుకుదేవుడు పాండురంగడు. భక్తులపాలిటి కల్పవృక్షము. పండరికి నాలుగుమైళ్ళ దూరములో గోపాల పురమను నొక గ్రామము కలదు. అందు నొక బీదబ్రాహ్మణ కుటుంబము కలదు. ఒకతల్లి, కుమారుడు, కోడలు. కోడలు పేరు సక్కుబాయి, కుమారునిపేరు విశ్వనాథుడు. సక్కుబాయి తల్లి తండ్రు లతి భక్తులు. ఆ భక్తియే కుమార్తె కబ్బినది. ఆమె తల్లి తండ్రులవలె పాండురంగని యెల్లప్పుడు పూజించుచుండెను. పుట్టినింట నున్నప్పుడు పాండురంగని యుత్సవమునకు తల్లి దండ్రులతో గలిసి పోవుచుండుట యల వాటు. ఆమె క్రొత్తగా నత్తవారింటికి వచ్చినది. ఆమె చాల యందకత్తె. విశ్వనాథునకు భార్యయందు మిక్కిలి ప్రేమ గలదు. సక్కుబాయియును భర్త నన్నివిధముల సేవించు చుండెను. ఆమె యుత్తమురాలగు ఇల్లాలు. ఆమె యత్త మిగుల గడసరిది. గయ్యాళి గంప. కోడలిని సరిగా మసల నిచ్చెడిది కాదు. ఆమె కనుమానము మెండు. ఎప్పుడు నింటి పనుల యందణచి పెట్టుచు మిగుల బాధించుచుండెను. విశ్వనాథునితోడనైన సరిగా మాటలాడనీయదు. అత్త యెన్ని బాధలు పెట్టినను సహనముతో నోర్చుకొనుచుండును

ఒకనాడైన కోపగించుకొనదు. ఈసడించుకొనదు. పాండు రంగనిమీద మనస్సుంచుకొని యత్త చెప్పిన పనులన్నియు చేయుచుండును. పాండురంగడామె భక్తికి చాల మెచ్చుకొనుచుండును.

మహారాష్ట్రులు నిత్యము జొన్నరొట్టెలు, సజ్జరొట్టెలు గోధుమ రొట్టెలు తినుట యలవాటు. ఒక మాసమునకు సరిపడు జొన్నలు, సజ్జలు, గోధుమలు ముందుపోసి సాయంకాలమునకు వానిని విసురుమని అత్త సక్కుబాయికి నాజ్ఞాపించెను. సక్కుబాయి వాని నన్నిటిని కడిగి చక్కగా దంచినది. చేతులు బొబ్బలు కట్టినవి. అది యెండాకాలము. వానిని యెండబోసి విసురుటకు ప్రారంభించినది. కొన్ని విసురునప్పటికి ఒడలంతయు చెమటలు పోసినవి. చేతులు కందిపోయినవి. ప్రాణము శోషకు వచ్చినది. చెంగుపరచుకొని రంగని ధ్యానించుకొనుచు కొంచెముసేపు మేను వాల్చినది. అంతలో కంటికి కునుకు పట్టినది. క్షణములో నొడలు తెలియని నిద్ర వచ్చినది. ఆమె లేచునప్పటికి సాయంకాలమైనది. ఎట్టని చీకటు లావరించినవి. సక్కుబాయి గుండె దడదడ లాడినది. ఒడలు కంపించినది. ఇటునటు చూచినది. అచ్చట జొన్నలు లేవు, సజ్జలు లేవు, గోధుమలు లేవు. ఆమె భయపడి నలువైపులు చూచినది. ఏపిండి కాపిండి వేరువేరుగా సంచుల కెత్తబడి యుండెను.

అంతలో నత్తగారచటికి వచ్చెను. మండిపడుచు 'ఏమే పిండులన్నియు విసిరితివా?' అని ప్రశ్నించెను.

సక్కుబాయి కేమి సమాధానము చెప్పవలయునో తెలియలేదు. బిత్తరపోయి చూచుచుండెను.

"ఏమే దయ్యముపట్టినదానివలె నట్లుచూచెదవేమి? మాట్లాడవు" అని నాలుగంటించినది. సంచులు చూచినది. పిండ్లువిసర బడియుండెను. అత్తగారాశ్చర్యపోయినది. పదిమంది మనుష్యులు వారము రోజులు విసిరినను తరగని ధాన్యము, క్షణములో విసిరి సంచుల కెత్తినది ఆమెకు. భయము, అనుమానము తోచినది. ఆమెకు దయ్యము పట్టినదని తలంచినది. దానిని వదలింపవలయునని యూహించినది. దొడ్డిలోనికి పోయి చీపురుకట్ట తెచ్చినది. కోడలిని నెడాపెడా కొట్ట నారంభించినది. ఆ దెబ్బలన్నియు తనకే తగులుచుండెను. కోడలి కేమియు బాధ కలుగలేదు. పాండురంగ డామెయందు లీనమై యామె కే యాపదయు రాకుండ చేయుచుండెను. అత్తకు కోప మినుమడించినది. ఆమె కాళ్లు చేతులు కట్టివేసి యొక గదియందు త్రోసి తాళము పెట్టెను. సక్కుబాయి కానాడంతయు నన్నము లేదు, పానము లేదు. ఆమె యా గదియందు కనులు మూసికొని రంగని ధ్యానము చేయుచు నేలమీద పడియుండెను. ఆమెకు క్రమ క్రమముగా నిద్ర పట్టినది. రాత్రి రెండు జాములైనది. ఆమె నెవరో వచ్చి లేపినట్లయినది. ఆమె కన్నులు తెరచి చూచెను. భర్త విశ్వనాథుడు ఒకచేత నన్నము పళ్లెము, నింకొకచేత నీటి చెంబు పుచ్చుకొని యెదుట నిలిచియుండెను. సక్కుబాయి భక్తితో లేవబోయినది. కట్టు త్రాళ్ళామెను లేవనీయలేదు.

విశ్వనాథుడు పళ్ళెము చెంబు క్రిందపెట్టి బంధములను విడి పించెను.

"సక్కూ! నీకొరకన్నము తెచ్చితిని, తిను" అని బ్రతిమాలెను.

మీ యమ్మగారికి తెలియునా!

చెప్పియే తెచ్చితిని.

ఆమె యిష్టపడినదా!

పడకేమి! నీమీద కోపమా!

సక్కూబాయి నమ్మినది. అన్నము తినినది. దినములు మూడు గడచినవి. పాండురంగని యుత్సవము లారంభ మైనవి. భజనలు చేయుచు భక్తులు గుంపులుగూడి పోవు చుండిరి. సక్కూబాయికి పండరికి పోవలయుననియు, రంగని సేవింపవలయుననియు, బుద్ధిపుట్టినది. ఆనాడు భర్త యథా రీతిగా నన్నము తెచ్చెను.

"స్వామీ! రేపు పండరినాథుని కళ్యాణము" అన్నది సక్కూ.

అవును సక్కూ.

స్వామిని సేవింపవలయునని యున్నది.

దానికేమి?

అత్తగా రనుమతింతురా?

నేనున్నాను కదా నీకేమి భయము.

విశ్వనాథుడు సక్కూబాయి కట్లన్నియు విప్పెను. స్వామిని సేవించిరమ్మని తలుపులు తీసి పంపెను. సక్కూ

బాయి కమితానందము కలిగినది. భర్త పాదములకు నమస్కరించి బయలుదేరినది. అత్తగారు కుమారుడుకూడ పండరికి బయలుదేరిరి. కోడలెట్లున్నదో చూడవలయునని గదిలోనికి వచ్చినది. సక్కుబాయి యధారీతిగా త్రాళ్ళయందు కట్టబడి యుండెను. ఆమె, "అత్తా! నేనుకూడ పండరి వత్తును" అనెను.

"ఓసీ! నీ ముఖానికి పండరి కూడాను. సిగ్గులేదూ" అని నాలు గరచినది. తలుపులు బంధించి పోయినది. పండరి చేరినది. అక్కడ రంగని యెదుట సక్కుబాయి రంగని ధ్యానించుచు పరవశముతో కూర్చుని ఉండెను. అమ్మలక్కలందరు సక్కుబాయిని, మీ యత్తగారు వచ్చినదని కొట్టి పిలిచిరి. ఆమె పలుకలేదు, లేవలేదు. ఆమెయాత్మ రంగని యందదివరకే కలిసి పోయినది. అత్తయు, భర్తయు నామెను చూచి విస్తుపోయిరి. "ఇంటిలో సక్కు ఇక్కడికెట్లు వచ్చిన" దని ఆశ్చర్యపోయిరి. ఈ నాటకమంతయు రంగడే యాడెను. రంగడే భర్తగా వచ్చి సక్కున కన్నము పెట్టెను. ఆయనయే తాను సక్కుగా నింటి యందుండి యామెను పండరికి పంపెను. పాండురంగడంత భక్తపరాధీనుడు అని తండ్రి విద్యావతికి కథ చెప్పెను. పాండురంగని సేవించి గోపాల పురమున కిరువురు పోయిరి. అచట సక్కుబాయి గుడి కలదు. ఆమెను సేవించి మరునాడు పూనా నగరమునకు వచ్చిరి.

# మ హా కా ళ ము

మహాదేవా ! భూలోకమునందు...

అవును నాకు తెలియును. పాపము పెరుగుచున్నదనే గదా నీ వనునది.

అవును స్వామీ !

దానికి తగిన యుపాయ మాలోచింపవలయును.

ఆలస్యము చేసినచో యమలోక మింక చాలదు. ఇప్పటికే పాపులతో క్రిక్కిరిసి పోయినది. క్రొత్త లోకములు నిర్మింపవలసి యుండును. ప్రతి దినము వచ్చు పాపులకు మితి లేకున్నది. చిత్రగుప్తుని చిట్టాలు బండ్లకు పెరిగిపోయినవి. వానికి సహాయముగా పదిమంది లేఖకులను నియమించితిని వారికి శ్వాస యాడని పని యున్నది. ఏమి చేయవలయునో నాకేమి తెలియుటలేదు. ఇంద్రలోకము వట్టిపోయినది. అచటికి పోవువారే లేరు. యజ్ఞయాగము లంతరించినవి. రాక్షసులు పెల్లురేగి మునుల యాశ్రమముల మీదపడి బాధించుచుండిరి. వారిని తపమును చేసికొన నిచ్చుటలేదు. రాక్షసుల బాధలనుపడలేక మునులు తపస్సు మానిరి. భూలోకమునందు వర్ణాశ్రమ ధర్మములు తారుమారైనవి. యవనులు, శబరులు, మ్లేచ్ఛులు, కిరాతులు మితిమీరి నగరముల మీదను, పల్లెల మీదనుపడి స్త్రీల నెత్తుకొని పోవుచుండుట చేత పాతివ్రత్యము నశించినది. వర్ణసంకరము లేర్పడినవి. రాజులు బలహీనులయి దుర్మార్గులను నడపలేక యూరకుం

డిరి. పాపము పెచ్చు పెరిగినది. భూదేవి యీ బరువు మోయ లేక తబ్బిబ్బగు చున్నది, అని యమధర్మరాజు మనవి చేసి కొనెను. అంతలో భూదేవి కైలాసమునకు వచ్చినది. ఆమె కనులవెంట నీరు ధారలుగట్టి ప్రవహించు చుండెను. ఒడలు తూగాడుచుండెను. ఆమె పరమేశ్వరునకు నమస్కరించినది.

"పరమేశ్వరా! ఇంత కాలమైనది. నేను భూదేవి నయి చరాచరభూత సమూహములను మోయుచుంటిని. అనేకమంది రక్కసులను మోసితిని. నాకంత బరువనిపించ లేదు. రావణుడు, త్రిపురాసురులు, చండ ముండాసురులు నా శరీరమును పెక్కు విధముల బాధపెట్టిరి. అప్పుడుకూడ నాకు భారమనిపించలేదు. ఇప్పుడు పాపభారముచేత నా యొడలు క్రుంగిపోవుచున్నది. మహాదేవా! నేనీ బాధ భరించలేను, నన్ను కాపాడుము" అని ప్రార్థించెను.

అంతలో శంకరుని శిరమునందున్న గంగాభవాని శివునితో, "స్వామీ! భూదేవి వచించిన దంతయు నిజము. మానవలోకమునందు పాప మమితముగా పెరిగి పోయినది. వారి దురాచారముల కంతును బొంతును లేదు. ద్రోహము లకు పరిమితిలేదు. పాపములనుచేసి పరిహారముకొరకు గంగలో మునుగుచుందురు. ఆ పాపములు నాకు సోకి నా దేహమంతయు మలిన మైనది. ఇంక కొంత కాలమిట్లే యున్నచో పావనము లగు నా జలములు పంకిలము లగును. అప్పుడు నా స్థితి చెప్ప నక్కరలేదు. కావున దీనికి పరిహార మిప్పుడే యూహింపుడు" అని ప్రార్థించెను.

పరమేశ్వరుడగు శివుడు కొంచెముసేపు కనులుమూసి కొని యాలోచించెను. మానవలోకమునందలి సమస్త విష యములు అవగతము లయ్యెను. కనులు తెరిచి యమధర్మ రాజుతో నిట్లనెను, "యమధర్మరాజా! నేను సమస్తమాలో చించితిని. నీవు చెప్పినదంతయు నిజము. కొంతకాలమిట్లే యున్నచో నెప్పుడో రావలసిన విలయ మిప్పుడే రావలసి వచ్చును. అట్లు కాకుండుట కొరకు యాలోచన చేసితిని. ఇదిగో యిది నాయాత్మలింగము. ఇది మహాప్రభావము కలది. దీనిని దర్శించిన వారికి సకల పాపములు పటాపంచ లగును. పూర్వ మొకప్పుడు రావణుడు ఘోరమగు తపస్సు గావించెను. ఆతని తపమునకు లోకములన్నియు తలక్రిందులు కాజొచ్చినవి. దేవతలు తబ్బిబ్బయిరి వాని తపము మాన్పుట కెవరికి సాధ్యము కాలేదు. అందు మూలమున నేను వానికి ప్రత్యక్షమయి నీకేమి వరము కావలయునో వేడుకొనుమని యడిగితిని. రావణుడు స్వామీ! నీవు నా లంకయందు నిరం తరము కాపుర ముండుమని వేడుకొనెను. నేనందుల కంగీక రింపక వానికి నా యాత్మలింగము నొకదాని నిచ్చి పంపితిని. అది మహాప్రభావము కలది. అది యాతనితో నున్నచో రావణుడు దుర్మార్గుడు కావుననేమైన చేయగలడు. కాని వాడు చేసిన తప్పుచేత నా యాత్మలింగము లంకాపురము వరకు తీసికొనిపోలేక పోయెను. అది మహాబలిపురమునందు నాటుకొని పోయెను. దానిని దర్శించిన వారందరు పాపములు నశించి పుణ్యములు పొందుదురు. అంతకంటె మిగుల ప్రభా వము కలదీ లింగము. దీనిని తీసికొనిపోయి పాపములతో

నిండిన ప్రదేశమునందు ప్రతిష్ఠింపుము. కొలది కాలములో నీ కష్టము తీరిపోకలదు" అని తన యాత్మలింగమును యమున కొసంగెను.

యముడు దానిని మహాప్రసాదమని కనుల కద్దికొనెను.

యముడా యాత్మలింగమును తీసికొని భారతదేశ మంతయు సంచరించెను. ఉత్తర భారతమునందు కాశి, గంగ కలవు. గంగయందు స్నానముచేసి శివుని దర్శించిన వారికి సకల పాపములుపోయి కైలాసము చేరుదురు. కావున నచట నీ లింగమును ప్రతిష్ఠింప వలసిన పనిలేదు. దక్షిణమునందు రామేశ్వరలింగ మున్నది. మధ్యప్రదేశములందు శ్రీశైలము ద్రాక్షారామములు గలవు. అవి మహాపుణ్యభూములు. అందు శివుడు స్వయముగా పార్వతీదేవితో సంచరించుచుండును. మహారాష్ట్రమునకు బొంబాయి రాష్ట్రములకు మధ్య ఆంధ్ర దేశమునకు పశ్చిమోత్తరదేశము కిరాతులకు, బర్బరులకు, పర్వతీయాంధ్రులకు నివాసము. అచటి వారందరు రాక్షస కృత్యములకు వెరవని వారు. వారు పరిసర నగరములను, గ్రామములను ధ్వంసము కావించి పాపకృత్యములు చేయుచుందురు. వారికి దయా దాక్షిణ్యములు లేవు, ధర్మాధర్మములు లేవు, నీతి యవినీతులు లేవు, ఆ పరిసర ప్రదేశము లన్నియు పాపపంకిలములు. ఆ ప్రదేశములను సంరక్షించుట కచట శివుని యాత్మలింగమును స్థాపింపనెంచెను.

బృహస్పతి దేవతలకు గురువు. వానితో యముడు సంప్రదించెను. మంచి ముహూర్తము పెట్టించెను. గోదావరి

కవలి యొద్దున శివలింగమును ప్రతిష్ఠించెను. దానికి దేవతలు, దిక్పతులు, దేవేంద్రుడు వచ్చిరి. ప్రతిష్ఠ మహావైభవముగా జరిగిపోయినది. బ్రహ్మ నమక చమకములతో మొదల నభిషేకము గావించెను. దేవేంద్రుడు బంగారు కమలములతో సహస్ర నామములు చదువుచు శివునకు పూజ గావించెను. కల్పవృక్షములు శివునిమీద తమ పూవులను రాల్చినవి. కామధేనువు తన పొదుగునుండి క్షీరములను వర్షించెను. ఆ దినమెల్ల నప్సరసలు నాట్యము చేసిరి. గంధర్వులు పాడిరి. మహావైభవముతో నైదు దినము లుత్సవము జరిగెను.

ఈ సంగతి దేశదేశములందు పాకినది. వివిధ ప్రాంతములనుండి ప్రజలు తండోప తండములుగా వచ్చి శివుని దర్శించి పోవుచుండిరి. శివుని దర్శించినవారి పాపములు పటాపంచలగు చుండెను. మరణానంతరము వారు సరాసరి కైలాసమున కరుగుచుండిరి. ఆ పరమశివునకు మహాకాళుడని దేవతలు పేరు పెట్టిరి. ఆ దేవుని సేవించు ప్రజలాయన చుట్టు నిండ్లు కట్టుకొని నివసింప మొదలు పెట్టిరి. పల్లె గ్రామమయినది. అంతకంతకు పెరిగి పెద్దదయి మహానగర మైనది. ఆ నగరమును మహాకాళమని యా దేవుని పేరట నిలిచినది. అది పర్వతీయాంధ్ర రాజులకు ముఖ్యపట్టణ మైనది.

## ౨

గురుదేవా నమస్కారము.

ఏమి దేవేంద్రా!

అంత కంతకు ప్రమాదము హెచ్చిపోవుచున్నది.

ఏ మది ?

మహాత్మా ! పరమశివుడు యమున కాత్మలింగ మిచ్చెను.

ఇచ్చిన !

దానిని మహాకాళమునందు ప్రతిష్ఠించెను.

అవును.

జనులందరు దానిని సేవించి ముక్తిని పొందుచుండిరి.

అది మంచిదే కదా !

అట్లనెద రేమి గురుదేవా ?

ఏమన మందువు ?

అందరు ముక్తిని పొందినచో స్వర్గ నరకము లేమి కావలయును ?

వానికి లోపమేమి వచ్చినది ?

ఇప్పుడు స్వర్గమునకుగాని, నరకమునకుగాని వచ్చువారు లేరు. అందరు మరణించి కైలాసమునకు పోవుచుండిరి.

మీపని సుఖమే కదా ?

పనిలేక పోవుటచేత సోమరితనము, దాని వలన చెడు బుద్ధు లలవడుటయు కలుగును. దానివలన ధర్మము నశించును. అది యట్లుండ నిండు. ఇప్పుడు స్వర్గ నరకములు రెండు పాడుపడినవి. యమదూతలు నిద్రభటులు. పనిలేక

దురాచారములకు దిగుచుండిరి. ఇక్లే కొంత కాలమున్న చో స్వర్గ మధర్మముల పాలగును. దేవతలు దురాచారులగుదురు.

నన్నేమి చేయమందువు ?

దీని కుపాయము వేడుచుంటిని.

మన మందరము కలిసి కైలాసమున కరుగుదము' శంకరు నడుగుదము. ఆయన చెప్పినటులు చేయుదము.

బృహస్పతి, ఇంద్ర, యము లు కైలాసమున కరిగిరి. అచట మహాదేవుని దర్శించిరి. ఆయన యోగసమాధియందుండెను. ఇంద్రాదు లాయనను పలువిధముల వినుతించిరి.

శివుడు కనులు తెరిచి వారిని చూచెను దేవతలారా! మీ రాకకు కారణము.

మహాదేవా ! మహాకాళుని దర్శించిన వారందరు కైలాసమును జేరుచుండిరి. యమలోకమునకుగాని, ఇంద్ర లోకమునకుగాని వచ్చువారు లేరు. రెండు లోకములు పాడు పడుచున్నవి. ప్రజలలో నందరు భక్తిపరులయి మహాకాళుని సేవించుచుండిరి. మా లోకములనుగాని మమ్ముగాని లక్ష్యము చేయువారు లేరు. అని యింద్రుడు, యముడు మనవి చేసికొనిరి.

శివుడు బాగుగా నాలోచించెను. దేవతలారా! యిప్పుడు నన్నేమి చేయమందురు. అని శివుడు ప్రశ్నించెను.

స్వామీ! యీ యాపద తొలగించుట కుపాయము తెల్పుడు.

దేవతలారా! యముడు ప్రాణములను హరించువాడు. ఆయన పేర నొక శివలింగమును ప్రతిష్ఠింపుడు. దానిని ముందు దర్శించి తరువాత మహాకాళుని సేవించిన వారికే ముక్తి చేకూరును. లేనిచో దొరకదు. ఈ రహస్యమెవరికి తెలియనీయకుడు అని యొక శివలింగము నిచ్చెను. యముడది తీసికొనిపోయి కాళేశ్వరు ప్రక్కభాగమునందు ప్రతిష్ఠించెను. శివుడు చెప్పిన రహస్య మెవరికి తెలియని జనులు యథా రీతిగా ముందు కాళేశ్వరుని దర్శించి పోవుచుండిరి. అట్టి వారికి ముక్తి లభించదు. కొంద రదృష్టవంతులు ముందు యమేశ్వరలింగమును దర్శించి మహాకాలుని సేవించుచు వచ్చిరి. వారికి మోక్షము ప్రాప్తించు చుండెను.

నారదు డొకనాడు కైలాసమున కరిగెను. అచట పార్వతీ పరమేశ్వరుల దర్శించి. "స్వామీ! మహాదేవా! నేను మహాకాళక్షేత్రమునకు పోయి వచ్చితిని. అచట మహా కాళేశ్వరుని దర్శించిన వారికి ముక్తి కలుగునను ప్రతీతికలదు. ఇప్పుడా పేరు నశించినది. మహాకాళేశ్వరుని యెదుట కొండ లుడను కిరాతరాజు తపస్సు గావించెను. అతడు మరణించి యమలోకమున కరిగెను. కారణమేమో తెలియకున్నది." అని నారదుడు పరమేశ్వరుని ప్రశ్నించెను. నారదు డొండొరులకు తగువులు పెట్టుటలో మొదటివాడు. మహాదేవుడు పర ధ్యానము నందుండి "నారదా! దానికి కారణము లేక

పోలేదు. అతని తపస్సు మెచ్చుకొన తగినది. కాని యతడు మహాకాళేశ్వరుని నిత్యము నమక చమకములతో, గోక్షీర ముల నభిషేకము లొనరించెను. కాని యొక్కనాడైన యమేశ్వరలింగమున కభిషేకము చేయలేదు. దానిని పూజింప లేదు. నేను యమున కొక వరమిచ్చితిని. ముందు నీవు ప్రతి ష్ఠించిన లింగమును దర్శించి కాళేశ్వరుని దర్శింపవలయును. అట్టి వారికే మోక్షము దొరకును అని. అది పరమరహస్యము ఎవరికి తెలియదు. కిరాత రాజటి యెరుగడు. కావున నరక మనుభవించ వలసి వచ్చినది" అని యున్న రహస్యము వెల్లడి చేసెను.

నారదుని నోట నువ్వుగింజ దాగదు. అతడు పరమేశ్వ రుని యొద్ద సెలవు తీసికొనెను. కైలాసము విడిచి భూలోకము నకు వచ్చెను. ఆ సమయమున మహాకాళేశ్వరున కుత్స వములు జరుగుచుండెను. లక్షలకొలంది జనులు ప్రభలు కట్టు కొని మహాప్రవాహమువలె వచ్చుచుండిరి. ఇసుక వేసినను రాలుటలేదు. వాద్యముల ధ్వనులు ఆకాశమును ముట్టు చుండెను. ఆటలు, పాటలు, పురాణములు, హరికథలు నిరాఘాటముగా సాగుచుండెను. నారదుడొక హరిదాసుగా మహాకాళమునకు వచ్చెను. మిక్కిలి జనసమ్మర్దము కలచోట నిలిచి కాళేశ్వరమహత్వమును హరికథ చెప్పనారంభించెను. అతి మనోహరమగు నారదుని పాట విని యచటి కందరు మూగిరి. మహాకాళేశ్వరుని మహత్వము నారదుడతి రంజ ముగా చెప్పెను.

చివరకు, "భక్తులారా! మీ రందరు మహాకాళేశ్వరుని దర్శించుటకు ముందు యమేశ్వరలింగమును దర్శించినగాని మోక్షములేదు. ఇది దేవతా రహస్యము. నారద మునీంద్రుడు శివుని వలన నెరిగిన సత్యమిది. మహాకాళేశ్వరుని యుత్సవము చేయుటకు ముందు యమేశ్వరుని పూజింపవలయును. లేనిచో ఫల ముండదు" అని రహస్యమంతయు బైట పెట్టెను.

ఆనాటి నుండియు జనులు ముందు యమేశ్వరలింగమును పూజించి మహాకాళేశ్వరుని దర్శించుచు వచ్చిరి. అట్టి వారందరు కైలాసమునకు పోవుచుండిరి. కైలాసమంతయు మానవులతో నిండిపోయెను. శివుడేనాటికానాడు సంఖ్య పెరిగి పోవుచుండుట చూచెను. దీనికి కారణమేమని యాలోచించి నిజము తెలిసికొనెను. ఒకనాడు శివుడు పార్వతితో మహాకాళమున కరిగెను. అచట కిరాతులు, మ్లేచ్ఛులు, బర్బరులుగూడి యాలయమంతయు నపవిత్రము చేయుచుండుట చూచెను. వెంటనే మహాకాళేశ్వరుని యందలి తన తేజము నపహరించెను. నాటినుండి యా లింగము తేజోవిహీనమైనది.

3

మహాకాళ మొకప్పుడు నాలుగు క్రోసుల విస్తీర్ణముగ పట్టణము. ఇప్పుడది యొక చిన్న పల్లెటూరు...

ఆ పల్లెకు చుట్టుప్రక్కలందు చాల దూరమువరకు శిథిలము లగు గుళ్ళ గోపురములు, మంటపములు, చెరువులు కనిపించు చుండును. ఆ నగర మెప్పుడు శిథిలమైనదో తెలియదు. కాని క్రీస్తు పూర్వ మూరవ శతాబ్దమునందా నగరమును ముఖ్య పట్టణముగా చేసికొని పర్వతీయాంధ్ర చక్రవర్తులు బహు కాలము రాజ్యపరిపాలనము గావించిరి. వారికి నాగరికాంధ్ర రాజులకు నిరంతరము యుద్ధములు సాగుచుండెడివి. వారిలో ముఖ్యుడగు బారశివ నాగరాజు శివభక్తుడు. నాగులు అడవి జాతివారు. వారు మోటువారయినను దైవభక్తి మెండు. వారు నాగులను పూజించుచుందురు. శేషువు, వాషుకి, కర్కోటకుడు వారి దేవతలు. నాగుబాములన్నియు వారి సంతతి వారనియు, వాని కపకారము చేసిన శేషవాసుకులకు కోపము వచ్చుననియు నాగుల నమ్మకము. కావున వారడవి యందు కాని, నగరమునందు కాని, పల్లెలందుగాని కనిపించు నే పామును చంపరు. చంపెడు వారిని దండింతురు. వారిలో కొందరు ప్రతిదినము నాగుబాములుండు పుట్టపుట్టకు బోయి పాలనుపోసి వచ్చుచుందురు. నాగు కనిపించినచో పాలు పెట్టుదురు. పాములు వారిని కరవవు. కరిచినచో దానిమెడ వారేదో యపరాధము చేసియుందుమని తలంతురు. మంత్ర ములచేత తంత్రములచేత విషము తీసివేయుదురు. నాగరాజు లకు పాములుగల జండా లుండును. తాము యుద్ధయాత్రలకు పోవునప్పుడు వానిని ముందు తీసికొని పోవుచుందురు. పాముల నలంకారముగా ధరించువాడు శివుడు. అట్టి శివుని నాగులు మహా భక్తితో పూజింతురు. మహాకాళములోని శివునకు

నాగులు పూజలు, అభిషేకములు, మ్రొక్కుబడులు చెల్లించు చుందురు. బారశివనాగరాజు శివపూజకొరకు పెద్ద చెరువులను త్రవ్వించి యందు కమలపుతీగెలను నాటించెను. అతడు ప్రతిదినము మహాకాలుని అవుపాలతో నభిషేకము చేయించి వేయి కమలములతో పూజించుట యలవాటు. వాని తరువాత నిశుంభుడనువాడు శివునకు ననేక మంటపములు కట్టించెను. యాత్రికుల సౌకర్యములకు చెరువులను త్రవ్వించెను. వాని యందు కమలపుతీగెలను నాటించెను. అతడు శివుని యెదుట మహాతపస్సు గావించి వరములను బొందెను. అతడు మహావీరుడయి నాగరికాంధ్రరాజ్యము మీదపడి కొంత భాగము తన రాజ్యములో కలుపుకొనెను. ఆ కాలమునందు కృష్ణానదీ తీరమున నున్న శ్రీకాకులమును ముఖ్య పట్టణము గావించు కొని ఆంధ్ర విష్ణువనురాజు పాలించుచుండెను.

ఆంధవిష్ణువు సుచంద్రుని కుమారుడు. సుచంద్రుడు మహాపరాక్రమవంతుడు. వానికి చాల కాలము సంతానము కలుగలేదు. ముసలితనము తలకెక్కి పండబారినది. సంతానము కొఱకు విష్ణువును గురించి యఖండముగా తపము చేసెను. ఒకనాడు విష్ణువు సుచంద్రునకు కలలో కనిపించెను. "సుచంద్రా! నీ తపస్సు ఫలించినది. సంతతికొరకు నీ వారాటపడు చుంటివి. నాయంశతో నీకొక కుమారుడు జన్మించును. అతడు శత్రురాజ్యములను రూపుమాయించి తెనుగు సామ్రాజ్యమును ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించును. నాగరాజుల నడుపులోనికి తెచ్చును. నీవు విచా

రింపకుము" అని పలికెను. సుచంద్రుడు నిద్రనుండి మేలు కొనెను. వాని ఆనందమునకు అంతులేక పోయినది. తన తరువాత తెనుగుదేశము గతి యేమగునాయని విచారించు చున్న సుచంద్రునకు ధైర్యము చిక్కినది. సుచంద్రుని దేవేరి గర్భవతి యయ్యెను. క్రమ క్రమముగా నెలలువచ్చి యొక మగ శిశువును గనెను. సుచంద్రుడు జ్యోతిష్యులను గావించి జాతకము వ్రాయించెను. వారు "మహారాజా! ఈ శిశువు పెరిగి పెద్దవాడయి మహాసామ్రాజ్యము పరిపాలించు"నని చెప్పిరి. రాజు మిగుల సంతోషించెను విష్ణువు అంశతో పుట్టినవాడగుటచేత సుచంద్రుడు వానికి విష్ణువను పేరు పెట్టెను.

కాలము గడచినది. విష్ణువు పెరిగి పెద్దవాడయి అన్ని విద్యలు నభ్యసించెను. మహావీరుడయి యుద్ధవిద్యలయందు గడితేరెను. బలవంతుడయి మల్లులను తడవకు పెక్కుమందిని ద్వంద్వయుద్ధమునందోడించుచు వచ్చెను. విష్ణుకుమారుని జయింపగల వీరుడెవడు లేకుండెను పండితులు శాస్త్రవాదము నందతనితో నోడిపోవుచుండిరి. సుచంద్రుడు విష్ణువునకు రాజ్యాభిషేకము చేసెను. తాను విశ్రాంతి గైకొనెను.

నిశుంభుడు మహాకాళమున రాజ్యపరిపాలన గావించు చుండెను. అతడు వీరాధివీరుడను పేరుపొందెను. సావకాశము దొరికినప్పుడెల్ల నాగరికాంధ్రరాజ్యముమీదపడి గ్రామము లను దోచుకొనుచుండెను. క్రమ క్రమముగా కొంత రాజ్య

మునుగూడ కలుపుకొనెను. పొలిమేరలందున్న నాగరికాంధ్ర ప్రజలు నిశుంభుని బాధలకు సహింపలేకపోయిరి. శ్రీకాకుళము నకు వచ్చి విష్ణువుతో మొరపెట్టుకొనిరి. విష్ణువు వారికి ధైర్యము చెప్పి యప్పటికి పంపివేసెను.

రాజులకు రాజ్యములమీద కోరిక మెండు. అధికారణముగా నాగరిక జనులను బాధించుచుండుదురు. నిశుంభుడు అపారమగు సేనను కూర్చుకొని నాగరికాంధ్ర సామ్రాజ్యము మీదికి దండెత్తెను. అతడు మహాకాళము మొదలు శ్రీశైలము వరకు జయించి తన రాజ్యములో కలుపుకొనెను. అంతవరకు ముందునకు జరిగి వచ్చుచుండెను. ఆంధ్ర దేశమంతయు తన వశము కావించుకొనవలయునని వాని కోరిక.

విష్ణువునకు కోపము మితిమీరినది. నిశుంభుని దురాగతములకు నోడలుంమడినది మహాసైన్యమును తీసికొని యుద్ధమునకు బయలుదేరెను. తెనుగుసేనలు విజృంభించి నిశుంభుడాక్రమించిన భాగములను వశము చేసికొనిరి. నిశుంభునకు విష్ణువునకు శ్రీశైలమున ఘోరమగు యుద్ధము జరిగెను. అందు నిశుంభుని సేనలు యుద్ధమునుండి పారిపోయినవి. విష్ణువు సేనలతో వారిని వెంబడించెను. నిశుంభుని ఎదిరించి యుద్ధమునందు చంపెను. పర్వతీయాంధ్రులను రూపుమాపుచు మహాకాళముదాక తన సేనలను విష్ణువు నడిపించెను. దానిని స్వాధీనము చేసికొని తెనుగుసామ్రాజ్యమునందు కలిపివేసెను. తరువాత విష్ణువు ద్రాక్షారామము

మీదుగా శ్రీకాకుళము చేరెను. తెనుగుదేశమునకు శ్రీశైలము, మహాకాళము, ద్రాక్షారామము ఎల్లలుగా చేసెను.

తరువాత తురుష్కుల కాలమందు మహాకాళము సర్వనాశనము చేయబడినది. ఇప్పుడు శిథిలములు మాత్రము మిగిలినవి.

# ద్వారక

## ౧

క్షేత్రములు సేవించుటవలన లాభము?

మనఃశాంతి.

అది యింటియందు కలుగదా?

కలుగదు,

ఎందుకని?

సంసారమొక మహాసముద్రము. మింటికెగసి మీది మీదికి వచ్చుతరంగములకు మనస్సు కలవరపడుచుండును.

క్షేత్రములను సేవించుటచేత నిలకడ కలుగునందురా?

కలుగుననికాదు. క్షణకాలము సంసార తాపత్రయములు మరచి పోవుదుము. దేవతా దర్శనముచేత కొంతయానంద మనుభవింప గలము. అన్నిటికంటె వివిధ ప్రకృతులను చూచుటయు, లోకజ్ఞానము వృద్ధిపొందుటయు కలుగును.

గ్రంథములు చదువుటవలన అంతకంటె విజ్ఞానము సంపాదింప వచ్చును.

అనుభవములేని విజ్ఞానము అర్థముతెలియని చదువు వంటిది,గ్రంథమందలి ప్రతివిషయ మనుభవమునకు తెచ్చు

కొనవలయును. అప్పుడుగాని సంపాదించిన విజ్ఞానమునకు విలువలేదు. కావుననే మన పూర్వీకులు తీర్థయాత్రలని దివ్య క్షేత్రములని పెట్టిరి.

పుణ్యతీర్థములందు స్నానముచేయుట వలన పాపములు నశించునందురు. మీానమ్మకము?

అమ్మాయీ! అన్నిటికి మనస్సు ప్రధానము పూర్వము లోపాముద్ర అగస్త్యునిట్లే ప్రశ్నించినది. ఆయన చెప్పిన సమాధానము నీకు తెలియదా?

తెలియదు.

ముందు మానవుడు తన మనస్సును పరిశుద్ధముచేసి కొవవలయును. తరువాత తీర్థసేవ గావింపవలయును. లేనిచో కాకులెన్నిసారులు గంగయందు మునుగుటలేదు. ఎన్నిచేపలు గంగలోపుట్టి గంగలో పెరుగుచున్నవి. వానికన్నిటికి మోక్షముకలుగదా. అబద్ధమున ప్రమాణములుచేసి గంగలో మునిగినంతమాత్రమున మోక్షమువచ్చునా? అట్లయినచో మోక్షమునుగూడ డబ్బుతో సంపాదింపవచ్చునని తలంప వలయును.

మఱి ఈ ధనవ్యయమెందుకు?

ఆ సంగతి మొదటే చెప్పితిని.

ఏమని?

సంసారమునకు దూరముగానుండుటకని.

అట్లయిన నడవులలో తపస్సు చేసికొనకూడదా?

అమ్మాయీ! ఇది ధర్మకాలముకాదు. పురాణయుగములందు బ్రాహ్మణులట్లే తపస్సుచేసికొనిరి. రాజులు వారి కనుగుణముగా వారిని సంరక్షించిరి. కార్తవీర్యార్జునుడు ఒక నాడు గంగానదియందు స్నానము చేయుచుండెను. ఆ సమయమున సమీపారణ్యమునందు ఒకముని తపస్సుచేసి కొనుచుండెను. ఒక సింహము మునిని చంపుటకు మీదిమీదికి పోవుచుండెను. ముని తపస్సమాధి యందుండెను. వానికా సంగతి తెలియదు. కార్తవీర్యార్జునుడా సంగతి గ్రహించెను. అతడు మహాతపస్వి ధర్మప్రభువు, దివ్యదృష్టి కలవాడు. వెంటనే గంగాజలము చేతిలోనికి తీసికొని యాముని యున్నదిక్కునకు మంత్రించి చల్లెను. వెంటనే సింహము మరణించెను. అప్పటి రాజులకాశక్తి యున్నది. ఈ కాలము నంటట్టి రాజులు లేరు. ప్రజల స్వాభావము మారిపోయినది. శాస్త్రములమీదను దేవునిమీదను నమ్మకము నశించినది. ఎవరైన పూర్వాచార పరులు కనిపించినచో వారినొక ప్రాత కాలపు జంతువుగా చూతురు. వానిని పరిహాసింతురు. వేళాకోళము చేయుదురు. తొల్లింటి గౌరవమర్యాదలు నశించినవి. మీది మిక్కిలి ద్వేషములు పెరిగినవి. అడవులందున్నను మానవునికి స్వేచ్ఛలేదు. ఇంక తపోవృత్తి నాశ్రయించు వారెవరు ?

విద్యావతీ కామరాజు లిట్లు మాట్లాడుకొనుచుండగా బొంబాయి స్టేషను వచ్చినది. కామరాజు పెట్టెలను పట్టుకొని

కుమార్తెతో కూడ రైలు దిగెను. అప్పటికి తెల్లవారుజాము నాలుగు గంటలైనది. తెల్లవారు వరకు స్టేషనులో కాల యాపన గావించెను. సూర్యోదయమున కాలకృత్యములు తీర్చుకొని టాక్సీమీద సముద్రపుటొడ్డు చేరిరి. అచట నొక పడవను ప్రత్యేకముగా మాట్లాడుకొని దానియందెక్కిరి.

అప్పుడు విద్యావతి తండ్రిని చూచి, "నాయనగారూ ద్వారకాపురము సముద్ర మధ్యమందేల కట్టవలసి వచ్చినది?" అని ప్రశ్నించెను.

కామరాజిట్లు చెప్పెను.

౨

మగధరాజ్యమునకు గిరివ్రజము ముఖ్యపట్టణము. దాని చుట్టు గోరథము, ఋషభము, వైహారము, ఋషగిరి, చైత్రకాద్రియను పర్వతములు పెట్టని కోటగోడలయి యుండును. అవి యాకాశము నంటుచుండు శృంగములు గలవి. ఆ పర్వతములను దాటిపోవుట కెవరికి సాధ్యము కాదు. చైత్రకాద్రి శిఖరమున రెండు భేరీలు కలవు. ఎవరైన విరోధులీ పురమును ప్రవేశింప ప్రయత్నించినచో నాభేరీలుతమంతటతాము మ్రోగును. వెంటనే జరాసంధుడు తనసేనలతో వచ్చి విరోధుల మీదపడి రూపుమాపును. జరాసంధుడపరిమిత పరాక్రముడు. బృహద్రథునికుమారుడు.

చేసెను. శ్రీకృష్ణుడు కంసుని ప్రయత్నములకు పడియలేదు. చివరకు మధురానగరమునకు అన్నగారగు బలరామునితో నరిగి కంసుని సంహరించెను.

# 3

శ్రీకృష్ణుడు కంసుని సంహరించెనని వార్త జరాసంధునకు తెలిసెను. జరాసంధుడమితకోపము గలవాడయ్యెను. సైన్యములను సమకూర్చుకొని మధురానగరము మీదికి దండెత్తెను. యాదవవీరులు వ్యూహములను పన్ని జరాసంధుని కెదురు నిలిచిరి. యుద్ధమతి భయంకరముగా జరిగెను. యాదవవీరులు విజృంభించి జరాసంధుని సేనలను మడియించు చుండిరి. జరాసంధు డన్ని మూలలందు తానయి యాదవసేనలను మట్టు పెట్టుచుండెను. వాని పరాక్రమముం దాగలేక పారిపోవ మొదలు పెట్టిరి. జరాసంధుని శరీరము బాణములకు కత్తులకు ఛేదింపబడునది కాదు. అస్త్రములు వాని నేమియు చేయలేవు. వాని శరీరము వజ్రముకంటె గట్టిది. జరాసంధుని యందెన్ని యాయుధములు ప్రయోగించిన నుపయోగములేదు. అవి వాని నేమియు చేయలేవు. జరాసంధుడు యాదవసేనలను తరిమి కొట్టెను. యాదవసేనలు దిక్కులకు పారిపోయినవి. జరాసంధుడు మధురాపురమునందు ప్రవేశించెను. శ్రీకృష్ణుని కొరకు ఇల్లిల్లు గాలించెను. రాజసౌధములు వెదకెను. కృష్ణుడెక్కడ కనబడ

లేదు. శ్రీకృష్ణునకు జరాసంధునిసంగతి బాగుగా తెలియును. అతడు మాయామానుషరూపుడు. ఎంత దేవతాస్వరూపుడయి నను కాలమునకు కట్టుబడి యుండకతప్పదు. శ్రీకృష్ణు డెచ్చట దాగెనో యే రూపమున నుండెనో యెవరికి తెలి యదు. ఎందు వెదకినను గానరాలేదు. జరాసంధుడు విసుగు చెంది తనసేనలను మరలించుకొనిపోయెను. ఒకసారి కాదు, రెండుసారులు కాదు, ఏడుసారులు జరాసంధుడు మధుర మీదికి దండెత్తివచ్చెను. శ్రీకృష్ణుడు దొరకలేదు. జరాసం ధుని దురాగతమునకు శ్రీకృష్ణుడు సహించలేకపోయెను. వానిబారినుండి తప్పించుకొనుట కుపాయమాలోచించెను. మయుడను శిల్పిని రావించినాడు శ్రీకృష్ణుడు. జరాసంధుని దుర్మార్గము నంతయు వానికెరిగించెను. "మయా! నాకూ మానవమాత్రులకు ప్రవేశింపరాని పురమునొకదానిని నిర్మింపు"మని యానతిచ్చెను. అందుకు మయుడు "కృష్ణా! త్రిలోక సంరక్షకుండవగు నీయానతి కాదనగలవారెవరు? నీ కొరకు పది యోజనముల విస్తీర్ణమగు పురమును నిర్మించి పెట్టుదును. సముద్రుని యాజ్ఞాపించి పుర నిర్మాణమునకు తగిన ప్రదేశమును సంపాదింపుమని యనెను. శ్రీకృష్ణుడు మహావిష్ణువు. వాని కోరిక కాదనగలవారెవరు! వెంటనే తన మనమునందు సముద్రుని తలంచెను. సముద్రుడు శ్రీకృష్ణుని యెదుట సాక్షాత్కరించెను. వానికి నమస్కరించి, "శ్రీకృష్ణా! పురాణ పురుషా! నన్ను తలంచిన కారణ మేమో సెలవిమ్ము. నీ యానతి శిరమున దాల్చి నెరవేర్తు" నని పలికెను.

శ్రీకృష్ణుడు సముద్రుడా! నా కొఱకు యముడు ఒక పురమును నీ గర్భమునందు నిర్మింప తలంచినాడు. వానికి పది క్రోసుల మేర యడిగిన చోట నిడు'' మని యాజ్ఞాపించెను.

సముద్రుడందుల కంగీకరించెను. యముడు సముద్రుని వెంటపెట్టుకొని సముద్ర తీరమున కరిగెను. అతడు తన చేతి యందలి యొక సాధనమును సముద్రము మీదికి విసిరివేసెను. అది పది క్రోసుల దూరము చుట్టి వచ్చెను. అంత మేరయు నీరినికి మెట్టగా నేర్పడెను. యము డా ప్రదేశము నందతి మనోహరములగు మేడలతోడను, తోటల తోడను, విశాలములగు బాటల తోడను, సరోవరముల తోడను నందమగు నొక పురమును నిర్మించెను. అది దేవతల పట్టణమును పోలి యుండెను. దానికి ద్వారకయను పేరు పెట్టబడెను. చుట్టు సముద్రముమధ్య నగరము చూచుట కందముగా నుండెను. శ్రీకృష్ణుడు తల్లి తండ్రులగు దేవకీ వసుదేవులతోడను, అన్న గారగు బలరాముని తోడను నొక శుభ ముహూర్తమున ద్వారకాపురము నందు ప్రవేశించెను. ఆనాటినుండి శ్రీకృష్ణుడు ద్వారకయందు చాలకాలము రాజ్యపాలనము గావించెను.

శ్రీకృష్ణు డవతారము చాలించెను. యాదవులు తమలో తాము పోరాడుకొని యందరు మరణించిరి. ద్వారకా పురము సముద్రములో కలిసిపోయెను. అదియే ఈ ద్వారకా పురము. ఆ కనుపించునది రైవతకాద్రి. అదియే యాదవులు పూజించు శివస్వరూపము.

కథ పూర్తియైనది. పడవ యొక పర్వత సమీపమునకు చేరినది. విద్యావతీ కామరాజులు పడవనుదిగి ఆకొండ నెక్కిరి. దానియందు నలుమూలల నాలుగుగుహలు కలవు. ఒకదానియందు శివునివిగ్రహమున్నది. అది నీటియలల రాపిడి వలననో లేక మరేకారణముననో విగ్రహమంతయు నరిగి పోయి ముక్కు, మూతులు కనిపించకుండెను. రెండవ గుహ యందు స్త్రీ విగ్రహము కలదు. అది మహాదేవి విగ్రహమని చెప్పుదురు. యాదవులా పార్వతీ పరమేశ్వరులకు ప్రతి సంవత్సరము మహోత్సవములు చేయుచుండెడివారట. దానికి కొంతదూరములో నింకొక కొండకలదు. అది రైవతకపర్వతమనియు దానిని యాదవులు దేవతగా పూజింతురనియు నందురు. విద్యావతీ కామరాజు లాయా వింతల నరసి తిరిగి వచ్చిరి.



# మా స్వంత ప్రచురణలు

| | | |
|---|---|---|
| నారాయణభట్టు | నోరి నరసింహశాస్త్రి | 7-50 |
| రాగరంజిత | వింజమూరి లక్ష్మి | 1-75 |
| పరాధీన | రాఘవ | |
| శాస్త్రవేత్తలు | కప్పగంతుల | |
| భాగవతోత్తములు | కంభంపాటి | |
| మహర్షి టాగూరు | కోట | 0-87 |
| మొగలిరేకులు | ,, | 0-75 |
| చిగురించని ఆశలు | ముద్దంసెట్టి | 3-00 |
| శ్రీకృష్ణ దేవరాయలు | రాజేశ్వరి దేవి | 5-00 |
| రాజేంద్ర ప్రసాదు ఉపన్యాసములు | ,, | 5-00 |

**[1952-56]**



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B178 |
| పుస్తకం పేరు | పూరి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 59, c i |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |